చ॥ ఇతనికితం డెసాటియగు నీతనికీతఁ డెసాటియౌచు [illegible]
ద్ధతిఁజను వెంటవీటనడిదంబుననంతటివారు [illegible]
పతికొకరుండుశిష్యుఁ డుగుబాహుఁ [illegible]
రతముఁడుశిష్యుఁడిట్లిరువురక్షరణధీ [illegible] నే [illegible]॥ సో॥హ॥

క॥ ఇరుచెవియెఱుంగకుండఁగఁ। దరుణి సుఖ [illegible]
వురకన్నులెదురఁబడితిని। సరివారెల్లి [illegible]॥ సో॥హ॥

క॥ అరదంబులు పొరిపొరిరై। హరులగములునుగ్గుసూచమై మొత్తుపుఁగా
ల్వురు సీదురుపలై- భా॥

క॥ నరకశిశుపాలురాదిగ। ధరణీకంటకులనధికతరదర్పులఁబ
ల్వురవధియింపఁగమహీనవ। తరించినమహాత్ముఁడవు నుత స్థిరశక్తిక్షా॥ భా॥

మూలము.

తే- గీ॥ సంస్కృతప్రాకృత సమానశబ్దములను
దనరచెప్పుడు గురువులు తద్భవముల
బహుళముగ లఘురేఫముల్వరఁగువీనిఁ
జెప్పెద సురక్షితజ్ఞ లక్ష్మీమనోజ్ఞ॥

టీక॥ తద్భవశబ్దములయందు బహుళముగ లఘురేఫములేయుండుననుట- బహుళగ్రహణముచేఁ గ్వాచిత్కముగ గురురేఫంబులును గలవనుట- అవి తృతీయాశ్వాసమున వివరింపఁబడును- ప్రాకృత తత్సమములు- రాణిమొదలైనవి- రాణిశబ్దము రాజ్ఞీశబ్దమువలన "జ్ఞోణః" అను సూత్రముచే నిష్పన్నమైనది- ఆంధ్రమందును రాణియనియె ప్రయోగింపఁబడుటచేఁ బ్రాకృత తత్సమమని చెప్పఁబడియె. రాణివాసంబు తుహినాద్రిరాజతనయ॥ భీమఖం ॥మిగిలినశబ్దముల నిట్లనే యెఱుంగుఁడు.

మూలము.

సీ॥ మరుఁడు దేవరయుఁ దామర కప్పురంబు చిత్తరువు నిబ్బరము చందురుఁడు నిడుర
తరగలు తిరము నచ్చెరువును కొమరుండు గరిడియు గరువంబు బరువు బిరుదు
మరియాద పరికించె నర రిత్త రిక్కయు రక్కసి రవణంబు రవుతు రచ్చ
కరవటంబరణంబు గంబురా మొకరిసాకిరి చెందిరంబునివ్వరిపెతరులు
పెరిమబికిరంబుమకురును కరగసంబు। తురకపరువడిచక్కెరక్కరమరదము
కరిసెనముబొమ్మరంబుకత్తెరమరాటి॥ తెందరయుదద్దురునుజగద్భరితగర్భ॥

ఇందలి పదముల కర్థోదాహరణములు వ్రాయఁబడును.

మరుఁడు — స్మరశబ్దభవము.

క॥ ఇరువురునొండొరువులఁ గడు। సురుచిరముగఁ జూచువాఁడి చూపుక్రాలఁదనకున్
శరములుగాఁ గొనియేసెను। మరుఁడయ్యిరువురమనోభిమానచ్యుతి గాన్॥ భా॥

దేవర — దేవశబ్దభవము.

మ॥ గురుఁడన్నన్ ధనమన్నఁ బుణ్యమనినన్ గోత్రోదయంబన్న దే
వరయన్నన్ మనమన్నఁ దృప్తియనినన్ వాత్సల్యమన్నన్ నిజే
శ్వరుఁడన్నన్ స్వపరోపకారమనినన్ సర్వంబు నన్నందలో
పరి నీకున్ నిషధాధినాథుఁడు సుమీ తథ్యంబుగాఁ జెప్పితిన్॥ నైషధము॥

తామర — తామరసశబ్దభవము.

క॥ నరుఁడలుకవాఁడమియును సు। స్థిరుఁడైతన యెఱ్ఱసెలలచెలువునఁ గెందా
మరలుం దెగడెడి కన్నుల। నరుణచ్ఛవి నెఱయ నిట్టులనియె నరేంద్రా॥ భా॥

కప్పురము — కర్పూరశబ్దభవము.

సీ॥ కస్తూరినీటను గలయంపులును గప్పురపు మ్రుగ్గులును బహురత్నతోర॥ భా॥

చిత్తరువు — చిత్రశబ్దభవము.

క॥ కరువునఁ దరువున శిలఁ జి। త్తరువున నినచంద్రరుచులఁ దారకరుచులన్
హరిహరధాత్రాదులకీ। హరిణము సరిరూపువడయ నలవియె యింకన్॥ రామాయణ॥

నిబ్బరము — నిర్భరశబ్దభవము.

మ॥ ఊరుసంధ్యాతపశోణమృత్కలితమై యొప్పారు బ్రహ్మాండమన్
గరిడిం గాలపు హెంతకాఁడు చరమాగస్కంధముం జేర్చు ని
బ్బరపున్ సంగడమోయనన్ శశిడిగెన్ బ్రాగ్భూమి॥ మను॥

చందురుఁడు — చంద్రశబ్దభవము.

చ॥ కెరలి మహాసిపేమ సహకృత్వరితద్భటకోటి చాతురీ
స్ఫురిసమరాంగణంబుల చతుస్సరిదావరణంబులన్ యశో
బరములు వేయుచుండు బహుభంగులఁ బున్నమనాటి నిండుఁ జం
దురునను సోఁగ వెన్నెలలతోఁ బులఁ దూఁగెడు తద్గుణంబులన్॥ వై॥

నిదుర = నిద్రాశబ్దభవము.

క॥ పురరక్షణంబుదృఢముగ। వరవరచేయంగవలయునమ్మఁగలుగు స
త్పురుషులనీడగుకడుపుని। దుర మొదలగులోనిపనులతోడుగ నరయన్ ॥ భా॥

తరగలు = తరంగశబ్దభవము.

సీ॥ కుంభజుమీఁదమార్గా నవచ్చునంబోధితరగలగమిఁబోలుఁ దురగములును॥ రా॥

తిరము = స్థిరశబ్దభవము.

క॥ ఆతఁడింతటిదిమహాభా।రతమేయనునిశ్చయము దిరంబుగమదిసం
గతమగుడునమ్మహాత్ముల। కతివిశదముగాఁగ నిమ్మహాకథసెప్పెన్॥ భా॥

అచ్చెరువు = ఆశ్చర్యశబ్దభవము.

చ॥ కురువిభురాజసూయమునకున్ ధనమిచ్చిరిరాజులెల్ల నా
దరమునఁబ్రీతిసేయునది తానునుదప్పకయంచు లంక క
చ్చెరువుగఁబుచ్చెదూతలఁ బ్రసిద్ధిగనంతవిభీషణుండుఁ జె
చ్చెర సహదేవుశాసనముఁ జేకొనిచేసెఁ గరంబునెమ్మితోన్॥ భా॥

కొమరుండు = కుమారశబ్దభవము.

పో।రునకరుదెంచెవేల్పుకొమరుండొకఁ డుద్ధురఖడ్గహస్తుఁడై॥ పారి॥

గరిడి = ఖురళీశబ్దభవము.

☞ "నిబ్బరము" అనుశబ్దమునకు వ్రాసియున్నయుదాహరణముంగనుఁడు.

బరువు = భరశబ్దభవము.

సీ॥ బరువంచుముత్యాల సరములఁ దివిచిచెంగటనున్నయింతిదోయిటనువైచి॥ క॥ మ॥

బిరుదు = బిరుదశబ్దభవము. (శూరుఁడు- బిరుదము-)

సంస్కృత శబ్దమగు బిరుదశబ్దమునకు శూరార్థకము లేదుగదా, తెలుఁగున నెట్లు వచ్చునని శంకింపవలదు. "క్వచిదర్థస్తు శబ్దస్యవికారేప్యన్యథోచ్యతే" అను నథర్వణోక్తివలనను, విన్నాణము మొదలగు కొన్నిశబ్దములట్లుగానంబడుటవలనను బాధకము లేదు.) ఉదాహరణములు.

క॥ బిరుదుగలమగలు గలరని। తరమిడిచంపింపఁజూచెదవు జనముల నీ
పొరువునబోవెటతుము మా। పురమునురాష్ట్రమునువిడిచి పొమ్మెటకైనన్॥ రా॥

చ॥ మురరిపుసన్నిభుండు పదమువ్వరగండయనంగఁబెట్టెఁదా

విరుదు తెలుంగు విజ్జఁ డరిభీకర భూరి భుజాబలంబుతో॥ భా॥

ద్విపదము॥ తురగాష్టకముతోడ ద్రుతగతితోడ
విరుదు టెక్కెములోడఁ బృథు కాంతితోడ॥ రంగనాథ॥

పరికించు=పరీక్షా శబ్దభవము

క॥ పరికింపఁగ బాహ్యాభ్యం। తరజనములవలన సంతతము నిజరక్షా
పరుఁడవయి పరమహీశుల। చరితము వీక్షింతె నిపుణచర నేత్రములన్॥ భా॥

ఆర=అర్ధ శబ్దభవము.

క॥ ఆరచందురు డెందములోఁ। జొరఁబాఱు చువడఁకుతోఁ కచుక్కయపోలెన్
నరకుండేసిన బాణము। హరి నిటలతటంబు నాటి యల్లల నాడెన్॥ సో॥ హ॥

ఈ ప్రకారముగఁ దక్కినవన్నియుఁ దెలిసికొనవలయును. గ్రంథ విస్తరభీతిచే నుదాహరణములు వ్రాయఁబడవు. ఇందలి "అర" శబ్దమును గురుత్వముగాఁ గూర్చి మంచి తిమ్మకవి వ్రాసియున్నాఁడు.

ద్విపదము॥ ఆఱగౌనులసియాడ నలసయానముల
మెఱుపులోయలతలై మెఱయఁ దీఁగలాలయ॥

| | |
|---|---|
| రిత్త=రిక్త | శబ్దభవము |
| రిక్క=ఋక్ష | ,, |
| రక్కసి=రక్షస్ | ,, |
| రవణము=రమ్య | ,, |
| రవుతు=రాహుత్ | ,, |
| రచ్చ=రథ్యా | ,, |
| కరవటము } కరాటము } కరండ | ,, |
| అరణము=హరణ | ,, |
| గంబురా=కర్పూర | ,, |
| మొకరి=ముఖర | ,, |
| సాకిరి=సాక్షి | ,, |
| చెందిరము=సింధూర | ,, |
| నివ్వరి=నీవార | ,, |
| పెతరులు=పితృ | ,, |

| | | |
|---|---|---|
| పెరిమ=ప్రేమ | శబ్దభవము | |
| బికిరము=భిక్షా | ,, | |
| మకురు=మకర | ,, | |
| కరగసము=క్రకచ | ,, | (రంపము) |
| తురక=తురుష్క | ,, | |
| బొమ్మరము } బొంగరము } భ్రమర | ,, | |
| తందర=తంద్రా | ,, | |
| పరువడి=పరిపాటి | ,, | |
| చక్కెర=శర్కరా | ,, | |
| అక్కరము=అక్షర | ,, | |
| అరదము=రథ | ,, | |
| కరిసనము=కర్షణ | ,, | (కృషి) |
| కత్తెర=కర్తరి | ,, | |
| మరాటీ=మహారాష్ట్రి | ,, | |
| దద్దురు=దద్రూ | ,, | |

ఇంక నిట్టివి బహుశబ్దములు గలవు. వానిం బ్రయోగములవలన దెలియంగునది అయినను బొమ్మరశబ్దమునకుఁ గరిసెనశబ్దమునకు మాత్ర మిఁకఁ బ్రయోగములు వ్రాసి విరమించెదను.

కరిసెనము=కర్షణ శబ్దభవము.

క॥ కరిసెనమును జేహారము। నరనిపనులఁ గూర్చుటయును నసఁగావృత్తుల్
నరునకు॥ ఏ. హా॥

బొంగరము, బొమ్మరము=ఇవి భ్రమరశబ్దభవములు.

సీ॥ బొంగరమనఁగను బొమ్మరమనఁగను భ్రమరాభిధానంబు పరఁగుచుండు॥ ఆంధ్ర
మూలము. [భాషార్ణవము

క॥ ఆరతియు నీరసము జడ। దారియు రాతిరియుఁ జూరిదారము కారుక్
గోరంటయాదిగా దీ। ర్ఘారూఢంబైన తద్భవావళి వెలయున్॥

ఇందలిపదముల కర్థోదాహరణములు వ్రాయఁబడును.

ఆరతి=ఆరాత్రికాశబ్దభవము.

సీ॥ ధూప। తతియిచ్చికపిలాఘృతప్లుతవర్తికా రమ్యదీపములనారతులమర్చి॥ ఏ॥హ

ఈరసము=ఈర్ష్యాశబ్దభవము.

క॥ తారుతముఁగాఁచికొనలే। రీరసమునఁగావఁబోదురింతుల వంశ్యా
చారస్థితిదాంభికులగు। వారుదమకకానిమఱుఁగువారికిసీదై॥ —దై॥

జడదారి=జటాధారిశబ్దభవము.

తే॥ గీ॥ ఎనసినరపాల నిరపాయహితవిహార। హరిగడిదేరియొకజడదారియయ్యె॥వసు॥
దీనివలననే పడగదారి విసదారి మొదలగు శబ్దములు వ్యాఖ్యాతములయ్యె॥

రాతిరి=రాత్రిశబ్దభవము.

క॥ చేతఁగొనియుప్పనములుట। రాతిరిపై యుప్పఁగొనుట రాత్రి దధి మధూ
పేతంబుగఁ గుడుచుటయు। శ్వేతరములుచేయుసక్తు లెగ్గున రేంద్రా॥ భా॥

చూరి=క్షురాశబ్దభవము.
దారము=ద్వారశబ్దభవము.

కారు=క్షారశబ్దభవము.
గోరంట=కురంటశబ్దభవము.

విస్తరభీతిచే నుదాహరణములు వ్రాయఁబడవయ్యెడు. మఱియు రాచకొలము శబ్దము లనేకములుగలవు.

శ్లో॥ అనిత్యయోర్భవేద్యత్ర గ్రామమానుషనామను
రేఫయోర్నిశ్చయస్తత్ర రేఫమాత్రైక గోచరః॥ (అథర్వణకారిక)

మూలము

తే-గీ॥ పురనరాఖ్యల నిశ్చయంబుఁ గనరాని
యెడల లఘురేఫమని నిశ్చయింపవలయు
నిశ్చయస్థలములయందు నియతరీతి
గురులఘు విభాగకృతియె చేకొనునది హరి॥

టీక॥ ఇందు గ్రామమానుష నామములయందు నెచ్చోట గురులఘు నిశ్చయాభావమగునో యచ్చట లఘురేఫము మాత్రమే ముఖ్యవిషయముగాఁగలదు. అనఁగాఁ జామఱ్ఱు, ఎఱ్ఱన్న, మొదలగుచోట్ల రేఫమునకు ద్విత్వాలింగము లుండుటవలన గురుత్వంబు. రామచంద్రపురము మొదలగుశబ్దములు సంస్కృతంబులగుటవలన లఘుత్వంబు సిద్ధంబు. కొరుటూరు, మారుఁటేరు, తిరుమలరాయఁడు మొదలగు శబ్దములకు నిశ్చయాభావము ఘటించుచున్నది- ఇట్టి యనిశ్చితశబ్దముల లఘురేఫములని నిశ్చయించుకొనవలయు-

చ॥ అరిజయకీర్తిసాంద్రుఁడగు నయ్యళిరామనరేంద్ర సోదరుం
దిరుమలదేవరాయని నుతింపఁదరంబె॥ వసు॥

క॥ గరితబడేబీబీన। క్కురబీబిక్ శేమ్మబీబిఁ గనుపట్టెడు నా
మరుఁడగునమీనుఖానుఁడు। సిరులొదవఁగఁ బెండ్లియాడెఁ జెలువలరంగన్॥

మఱియు దీనివలన భాషాంతర శబ్దములన్నిటియందు లఘురేఫమే యని యెఱుఁగవలయును-

క॥ అరబీ పారసీ కన్నడి। మరుమీ కర్నోజి తెలుఁగు మొదలగు బాసల్
పరికించి కుతుపవారల। నరయుచుఁ బొలుపొందునబ్దులల్లీ పుడమిన్॥ య॥

ఆశ్వాసాంతము.

మ॥ అసహాయ ప్రదర ప్రఖండిత దశాస్యచ్ఛత్రదండాయతా
వసుధాకర్ణజనుః ప్రగల్భకవితా వామాదృథాలింగితా
యసకృన్నామజపైకలోల జనదేహోత్థభ్రమక్షేపకా
స్వసముత్పాదిత చిత్రరూపక జగత్సంసార నిర్వాహకా॥

క॥ దోషప్రదోషపూషవి। భీషణపోషకవిధూత భీమేష్వాసాం
భీషణ దూషణ పేషణ। భూషితనీలపుర నీలపురజితనీలా॥

పైకందమునందలి "భూషిత నీలపుర" శబ్దమునకు విగ్రహ మిట్లు వ్రాసెదము. భూషితం నీలపురం యేనస ఇతి నీలపురనామ గ్రామాలంకార భూత ఇత్యర్థః। నీలేన పురేణ దేహేన జితో నీల, ఇంద్రనీలో యేనస ఇతివిగ్రహః॥

మాలినీవృత్తము॥ విదళితమకరాక్షా * విశ్వభక్తాఘురక్షా
వదనజితశశాంకా * వాసుధేయీ వశాంకా
మదనసదృశరూపా * మంజుభూషాకలాపా
ముదితతపనజాతా * మోక్షసౌఖ్యప్రదాతా॥

గద్యము-

ప్రథమాశ్వాసాంతముననున్నట్లే చదువుకొనునది.



శ్రీ శ్రీధరాయనమః.

# ద్విరేఫవర్ణ దర్పణము.

## తృతీయాశ్వాసము.

క॥ శ్రీమద్వామాంకవస। ద్వామామణిముఖ తుషారధామ దరస్మే
రామృత చకోరకతసే । త్రామహితసువర్ణ నేత్ర దశరథపుత్రా॥

తే- గీ॥ అవధరింపుమికఁ శకటాంగనామక రేఫ । మూలవచింతు లక్ష్యపూర్వకముగ
నన్నపార్య తిక్కన ప్రభృత్యాదిక । పేంద్ర కావ్య సమితి నెల్ల వెదకి॥

ఉమాలము.

సీ॥ అఱిముఱియఱగొట్టె మఱగొఱ లఱచుట యఱువది యఱమొటయఱవలఱుగు
లఱక్రమ్మ టఱువుల్లు నఱుగుట యఱడఱయఱటిరూపఱి యఱపొఱ డిఱకట
మిఱికికొని యొఱుకిఱియుటయుఱుసుక్రిక్కిఱియుట యుఱుముకో లిఱిసిపోఱు
నుఱికెనుఱుతయు అవుఱిదియు ఊడుఱుములు అనిఱోసమానుఱు నుఱియుయు ఎఱక
యుఱియుటయు బలముఱియెఱ పఱికమెఱుక
మెఱుఁగు పెఱుకువ మొఱఁగుట మొఱుక లెఱుకు
వెఱచి యెఱమంట యొఱపొఱ యొఱకటంబు
నాఱవె నొఱవలీలా ఖండితోరుచాప॥

ఇందలి పదముల క్రమోదాహరణములు దెలుపఁబడు.

అఱిముఱి = ఎడతెగక; అత్యంతము; అనర్గళము; త్వరఁగా; మాటిమాటికి.

చ॥ అఱిముఱిఁవైచు పాదపశిలావళిఁ బ్రాసము ద్రిప్పి దప్పిపోఁ
జఱచుచు విస్ఫులింగములు చల్లుమొగంబుఱి ద్రిప్పి వుచ్చుచున్॥ రామా॥ 1

క॥ పఱచు నాకకఱిది పతిముకు । జెఱమలకై యేయఁజిప్ప జిరుగఁగ నదిచి
క్కఱగాడి దుస్సిపాఱెన। నఱిముఱిఁ జాపఱవు వాఱియల్లటువడియెన్॥ మను॥ 2

క॥ నొఱిమీఱ బందెవట్టిన।నఱిముఱిఁ జంపినను గజము నన్యముప్రచ్చె॥ యా- స్కం॥

చ॥ క్రిక్కిఱియఁగఁ జేసె నాలుగిట జేసె తురంగములన్యథిష్ఠరుం
డఱిముఱిఁ జంపె సారథిఁ దదశ్వములం బటుబాణపాణియై॥ భా॥ 4

చ॥ కొఱకొఱమానవుల్మిగులఁ గ్రొవ్వి సురారులనేఁచ సాగిరం
చఱిముఱిఁ జుట్టుముట్టనుచు॥ రామా॥ 5

ఇందైదు పద్యములలో నఱిముఱులకు వరుసఁగా నర్థములఁ గనుఁడు- మొదటి పద్యమున నున్న యఱిముఱికి నెడతెగకుండ యని యర్థము- రెండవ యఱిముఱికి నత్యంతముఁ జావు పఱుగెత్తియని యర్థము- మూఁడవ యఱిముఱికి నవర్గళముగఁ జంపి యని యర్థము- నాల్గవ దానికి శీఘ్రముగానని యర్థము- ఏనవ దానికి మాటిమాటికి యను నర్థము సందర్భముగ నున్నది- అయినను, "తే॥గీ॥ ముందువెన్కల నా నఱిముఱి యనంగ । నలరుచుండును రెండు నేకార్థములుగ" నని యాంధ్రభాషార్ణవములోఁ జెప్పఁబడియున్నది- పైనవ్రాసిన యుదాహరణములలో "నఱిముఱిఁ జాపఱువువారి" అనుచో ముందువెనుకలు చావు పఱుగెత్తియని చెప్పవచ్చును- అపు డత్యంతార్థకత్వమునకు సంశయిలతురేమో- చ॥......నామహత్త్వము సమస్త జగజ్జనశ్రీయ మాయమై । మెఱయ వసిష్ఠ ముఖ్యులగు మిక్కిలి శాంతులఁ గీర్తిఁ జూచితో। నఱిముఱి వ్రజకుంఠవుగదా యరుదారె భవచ్చరిత్రముల్ ॥" అను దశావతార చరిత్రమునందలి పద్యములో నత్యంతార్థకత్వము గనంబడుచున్నది- ఇయ్యుదాహరణ మర్థముకొఱకు వ్రాసితిమిగాని శబ్దముకొఱకుఁగాదు- ద్విపదము॥ అఱిముఱి నగరుల నలిగి చూచుటయు। నఱువదివేవురు నట భస్మమైరి॥ రం-రా॥

అఱగొఱ్ఱెము—సాహసకృత్యము. (అఱగొండెమనియు నున్నది).

క॥ ఎఱిఁగి యెఱిఁగి నీముందఱ । నఱగొఱ్ఱెము సేసిపోయిరది కొసరై యు
త్తఱఁగైన హంసడిభకులు । గొఱపిందల వఱటికొనిన కోర్కులుగావే॥ సో-హ॥

అఱగొఱ—మర్మన్యూనత.

క॥ మఱియు నొకమాట యెవ్వరు । నెఱుఁగనియది దశరథునకు నేకాంతమునం
దఱగొఱలేని దృఢంబగు । తెఱుఁగు తపసి సెప్పవింటివే నాకరుండన్॥ ఉ-రా॥

అఱచుట—బొబ్బలు పెట్టుట.

సీ॥ అఱచినఁ బఱచిన వ్రేళ్లులు । గఱచిన నతఁడించుకయును గరుణింపక యం
దఱనగ్గుసేసి గుంపుల । కుఱికియు ఘనఖడ్గ దారుణోల్లాసమునన్॥ భా॥

అఱువది—సంఖ్యా శబ్దము.

ఈశబ్దము మొదల నాఱుపదులని యుండఁగా "ఆదేశస్స్యాత్ త్రత్రైకతా" అను నథర్వణోక్తివలనఁ బ్రాథమిక రూపమునందలి దీర్ఘాకార పకారములకు హ్రస్వాకార వకారాదేశములు నేకత్వమును రాఁగా "అఱువది" అని యయ్యెను. కూచిమంచి తిమ్మకవి యిందలిది యర్థాంశ వాచకమగు నరశబ్దమని చెప్పి యీ

పద్యము నాప్రకరణములో నుదాహరించెనది చింత్యము.

గీ॥ కలుగ నద్వికారములు నేకవద్భావ । మయ్యథర్వణోక్తి నఱువదద్యో
నర్ధభాగవాచి యరయనిపఱ్ఱెండ । ద్మన్నయదివిచార్య మచిదతీత॥

క॥ అఱువది గోటులు గడిపిన । ఱుఱక జగత్త్రయము నాక్రమించువ్వెత్తుగానం
దఱగొన్నయట్టి నరుఁగఁగ । నెఱసి కుముదుఁ డనుగుదెంచి నృపవరుఁగనియెన్॥ భా॥

అఱముటు — అభిక్రమము.

అభియానముఁ జనవ్చు నఱముటయన॥ ఆంధ్రభాషార్ణవము

క॥ ఎఱుఁగుడు నేను సుయోధను । కొఱగామియు నతనితోడఁ గూడిన నృపులం
దఱుఁబగ నుసనువ విడిచితిని । యఱముటయును సంధిపొసఁగ దనియుమహాత్మా॥ భా॥

అఱవలు — కఠినులు, నిర్దయులు, ద్రావిడులు.

గీ॥ ఉలుముగొన్నవాఁడు తొలుమేన నాఘాత । బంధవముల నొరుల ప్రల్లదనము.
నెఱచినాడు పంగు లఱవలై కాల్సేయ । విఱిచి సాధుజనులఁ బఱపినారు॥ భా॥

టీక॥ ఉలుము — కుష్ఠరోగము; పంగులు — ఈజన్మమున కుంటివారు; తొలుమేన — పూర్వజన్మమందు; అఱవలై — కఠినులై; "అఱవలు ద్రావిడు లఱవు టఱిసె" ననియప్ప కవీయము. గీ॥ పిఱికితనము నేమఱుటయు నఱవతనము । మెత్తఁ జాటును గార్యంబు నెత్తెలుంగ । నేరమియు విషయంబులఁ గూరుటయును । గలుగు పతికినుండదు సిరి దొలఁగిపోవు॥ భా॥ సీ॥ అఱవలైనను నలవైన వెఱవున ముట్టియుంటఁగఁ బట్టి గట్టి విడువ॥ భా॥

అఱగు — వేదిక.

అఱశేకి చనుటలు గఱపినాసుట॥ అప్పకవి.

అఱువుల్లు — రంధ్రములు.

క॥ ఉఱకసయుండెడును మైమఱు । వఱువుల్లుగ నేసిలీల నంగమునెల్లం
బఱియలుగఁ జేయనాతం । డఱిమఱిఁ దలఁకకయ నేసె నధికశరములన్॥ భా॥

అఱుగుట — జీర్ణమగుట.

చ॥ అఱుగునె యక్కుగుండు హృదయంబున నెమ్మెయి నెంచిచూచినన్
విఱుగునె మేరుభూధరము వెంగలివై రఘురామభామినిం
జెఱగొని పోవఁ జూచెద విసీ చెడఁ జూచెద వోరినీచ నా

కఱపిన బుద్ధిఁ గైకొనినఁ గాచెద జానకిం బ్రసన్నమ్మహీ౯॥ రామా॥

దీనివలననే "ఆఱకువ, ఆఱక, ఆఱపికొనుట" అను శబ్దముల రేఫములు గురువులని తెలియవలయు.

ఆఱడు = స్త్రీ మెడను గట్టుకొను పూస.

ఆఱక్రమ్మటయఱంటు లఱడఱ కంబిటియుట॥ అప్పకవి.

ఆఱ = కౌటిల్యము, కీడు, అపోహము, శయనగృహము.

సీ॥ ఆఱలేని నౌఁతదీప్తి మెఱుఁగెక్కి సరిమింటఁ జరియించు సంపూర్ణచంద్రుకరెం॥

గీ॥ దుర్ణయమున శకునికర్ణ దుశ్శాసనుల్ । గఱపఁ బాండవులకు నఱయఁ జేయఁ గడఁగెఁ బాండవులును గడు ధార్మికులు గానఁ । బారయవయ్యె వారి దురితవిధులు॥ భా

క॥ ఆఱునదివేలెం డ్లిద్దర। మెఱయంగా నేలినట్టి మీతండ్రికినే నఱలేని సఖుఁడ నైమ్మెయి। మఱతునె యీ రాజసుతుల మాన్యులమమ్ము౯॥ రా॥

ఆఱ, యిది శయనగృహార్థక మగునప్పుడు "అఱ్ఱ" అను శబ్దమునకు ద్విత్వలోపమైనదిగాన గురుత్వము నియతమె.

ఆఱఁటిచెట్టు = మోచావృక్షము.

క॥ ఆఱఁటులఁ బఱటుల బటిశెల। గటిశెల మొటెలెల **** కారముల్లెల్ల౯ నెఱసున్నలునగు ధరన। య్యఱఁటులఁ బఱటులను ద్రుతములగు వలసినచో౯॥

రూపటి = రూపుచెడి.

ఆదిశబ్దముచేత నేపటి, ఉక్కటి, పెంపటి, సిగ్గటి, మొదలైనవి గ్రహింపఁబడును.

క॥ ఎఱకలుగల కులశైలము। తెఱఁగు మెఱయ వాయుసుతుఁడు దివికి నెగసె బి ట్టుఱుము జలధరము క్రియను। క్కఱఁ దద్వచన మెల్ల నద్రువ నార్చుచుఁ గడిమి౯॥ భా

ఆఱపాఱడు = వామనుఁడు.

ఆఱువది కోట్లఱపాఱడు గుజ్జుక్కటి॥ అప్పకవి.

ఇఱకటము = సంకటస్థలము.

క॥ తఱుచుగఁ బెనుసందడిలో। నిఱకటమునఁ బద్ధనృపతి యీ నిగ్రహముం దొఱఁగుటయె యీప్సితార్థం। బఱచేతికి వచ్చినట్లు యని వెతగుడుచు౯॥ సై॥

ఇఱికికొనుట = అవకాశము లేనితావునఁ బ్రవేశించుట.

క॥ చఱచి యొకచేతఁ గూర్మముఁ। బెఱచేత గజంబుఁ బట్టి పెనచి ఖగేంద్రుం డిఱికికొని గగనవీథిం। బఱచె వియచ్చర విమాన పఙ్క్తులు దూల౯॥ ఛా॥

ఇఱుకు=వైశాల్యము లేకయుంట.

క॥ చెఱకు విలుకాఁడు కోమలి। యిఱుకుం జనుదోయి నడుమ నెదగుఱియిడి దాఁ
గఱకు విరిములుకు లేసెను। జఱుకున్ దనచేతిమేటి సూటిన్ ధాటిన్॥ క-ర॥

ఇఱుసు=రథావయవము-

బండి యిఱుసు క్రిక్కిఱియుట॥ అప్పకవి-

ఇఱియుట=కదియుట.

క॥ మఱికొంత సేపునకుఁ దె। ప్పిఱి లేచి ముకుందుమేను పెద్దయునుం బ్రో
ద్దిఱియఁగఁ గౌఁగిటఁ జేర్చెం। బఱిపోయిన తాల్మినుష్ణ బాష్పములురులన్॥ భా॥

ఇఱుముకొనుట=దట్టమగుట-

చ॥ ఇఱుముకొనం బొఱంగె దెస లేచిన చీఁకటినంచుఁ జేతులం
గోఱపులు పట్టి క్రుమ్మరుచుఁ గొండొక ప్రాణములున్న బాణముల్
పెఱుకుచుఁ బెంటలై పడిన పీనుఁగులం గలయంగఁ జూచుచున్
నెఱకుల చండకాండములు నిండిన యాఘనుఁ గాంచిరొక్కెడన్॥ రామా॥

ఉఱుకుట=వేగ నడచుట, పడుట, వెడలుట.

క॥ ఉఱికెడు వారలఁ జూచినఁ। దఱిమెడు వారికిఁ గడుపు దంబగుఁ గాదే
నెఱిచెడిన మనలఁ గని మఱి। మఱలం దయ దలఁప నలుఁడు మనబాంధవుఁడై॥ న-చ॥

గీ॥ ఏఁచి మున్నీరు చేసీఁత సీఁదనగ్ని। నుఱుకవాసుకి కోఱలు పెఱుకఁ గణఁగి
నట్లు గాదె రాధేయ నీవర్జునునకుఁ। బోరనెక్కుటి మాఱొక్కనఁ బూనుటయును॥ భా॥

మిగిలిన యుదాహరణంబులను "కొఱ" అనుచో వ్రాయఁబడును-

ఉఱుత=చిక్రోడము-

ఉఱసిరోసంబున నుఱుతఁ బట్టి॥ అప్పకవి-

ఉఱవు=గొప్ప; విస్తారము.

క॥ ఉఱవగు వాఱికపంటలు। గోఱియలపాఁడియు నుదుఱుపగుం బుసుపులకుం
దెఱవలు మట్టములయ్యెద। రెఱిదియ భుజియింతురర్థి నెల్లజనంబుల్॥ భా॥

ఉఱిది=బిగి.

ఉఱవన్నలావనుటుఱిది పెట్టిదమయ్యె॥ అప్పకవి.

ఉఱడు — లక్ష్యము సేయఁడు.

చ॥ ఉఱడు సురేంద్రుఁడైన బలియుండు హిడింబుఁడు వానివాఁడికిన్
వెఱువని వారలుం గలరె వీరలు ముందఱెఱుంగ రక్కటా
మొఱఁగిరయేని వీరుతమయింటుల నిద్రితులైన యట్టులే
మఱి శయనింతురే కడుఁ బ్రమాదము సేసిరి బుద్ధిహీనులై॥ భా॥

ఉఱుములు — గర్జితములు.

క॥ ఉఱుముచు మెఱయుచుఁ బిడుగులు। వఱలఁగ నలుగడలఁ బడ నవారితవృష్టిన్
గుఱకొని కురియఁగఁ బంచెను। మఱియును వయ్యానలుమీఁద మఖభుండలుకన్॥ భా॥

ఉఱనిరోసము — ఉడుగని కోపము.

"ఆఱవెయ్యి" అనుదాని యుదాహరణముం జూచునది.

ఉఱ — ఇష్టము; గొప్ప.

చ॥ వెఱచితి రాఁగ దేయనిన వెండిఁ కదాపఁగఁ దీర్తువీవు నా
వెఱపెటులున్న నీరధికవీరులు దీర్చెదరొల్లనిన్న నీ
యుఱునెడ కేగితోడువడు మొండులకెవ్వరికేనియన్న నే
త్తెఱనతఁ డేగి కౌరవపతింగని యిట్టులబిట్టువల్కినన్॥ భా॥

(నీయుఱునెడయనఁగా నీకునిష్టమగు చోటునకనుట)

ఉఱునట్టివరంబుదీనినొసఁగుమా పుత్రా॥ అనునీపద్యములో నుఱుశబ్దమునకు గొప్పయైనయని యర్థము.

ఉఱియ — దిట్ట.

ఉఱియ నిల్లుఱియుట॥ అప్పకవి

ఉఱక — యోగపదర్థకము; శీఘ్రము

దీనికి 'నఱువది' యనుశబ్దోదాహరణముం జూడవలయును.

ఉఱియుట — కుఱియుట.

దీనికి 'నుఱియ' అనుదాని యుదాహరణముం జూడవలయును

బలముఱి — బలముఁగలవాఁడు.

ఉఱెకరి బలముఱి॥ అప్పకవిం.

ఎఱుకు — కిరాతుఁడు.

క॥ ఎఱుకని యెఱుఁగక నీకు। న్నఱకున నెదిరించినాఁడ మఱువుము దీన౯
గఱకంఠా మన్నింపుమా। నెఱి నెవ్వరి కెఱుఁగ నగును నీ చరితంబుల్॥ భా॥

ఎఱచి — మాంసము.

సీ॥ గొఱియఁ జంపుడు ఖడ్గంబు నెఱచి గండ। మృగమునందలి పలలంబు మేఁక మాంస
మొక్కటొకటి ఫలమున నెక్కుడంద్రు। పితృసమర్చనవిదులైన పెద్దలధిప॥ భా॥

ఎఱమంటలు — దీప్తజ్వాలలు.

క॥ ఎఱమంటలు మిడియఁ జూడ్కులఁ। జుఱఁజూచుటయునపుడు చోద్యంబుగ నం
దఱు దగ్ధదేహులైరా। పఱితెంచుగ భస్మరాసులైరి నరేంద్రా॥ ఎ-హ॥

ఎఱయనఁగా నెఱ్ఱశబ్దమునకు ద్విత్వలోపమగునట్లుగాఁ దోఁచుచున్నది గావున నెఱసంజ మొదలగు శబ్దములన్నియు నిట్టివిగ నెఱుంగవలయు.

ఒఱపు — సొగసు; విలాసము.

చ॥ ఒఱపరిఁగన్నఁ గూడఁజను నూరకసన్నలు వారనాడుఁ ద
త్తఱపడు బోటి జీరెడు విధంబున నొత్తిలి పల్కనవ్వుఁ బ
ల్కఱుఁ బొరుగిండ్లకేగు నొకమట్టున నిల్వదు చంటిమీఁద ను
న్నెఱఁ గెడలించు వైశికపు సిగ్గునటించును జారధారుణిక౯॥ వై-భా॥

ఒఱపుశబ్దము కషణార్థకమగునపుడు ద్విరూపము.

ఒఱ — ఖడ్గకోశము.

క॥ ఉఱవగు శక్తియుఁ బోయిన। నొఱపెట్టిననాలు వెఱికి యుద్ధపథమునకు౯
మెఱుఁగు లెగయ ఝళిపించుచు। నుఱికె మరుత్తనయు నతుమురువడి త్రేసె౯॥ రామా॥

ఒఱ శబ్దము లేపకషణార్థకమగునపుడు ద్విరూపము-

ఒఱకటము — నిమ్నోన్నతము.

సీ॥ ఒఱకటంబునఁ బోవు టొఱపులు నా కెక్కు॥ అప్పకవి.

ఒఱలుట — ధ్వనితోఁ బొరలుట.

క॥ నెఱిఁ దప్పిపడిన పెల్లున। నొఱలెడి నరవాజికరుల యులివ భిమన్యుం
డఱిముఱిఁ బడుటకు వగమది। బఱిగొన నిల వెలుచన నఱచు భంగిఁ జెలంగ౯॥ భా॥

చ॥ తఱిగొనవంతలోన మఘదైత్యహరుం డహరేంద్రసింజినిం
గొఱనెలతూపునందునిమి క్రూరతరంబగు భల్లముక్కుటన్
నఱికినఁ గూలె ధన్వము ఘనాఘన కల్పితమైన చెక్కయుం
బొఱలుచునూడెఁ గాలి మొదలూడఁగఁ గూలెడు మ్రానుకైవడిన్॥ పా-హ॥

ఒఱవ=వక్రము.

క॥ అఱగొఱలు గుఱుచ చేతులు। నొఱవశరీరంబుగలిగి యొరులకుఁ జూడం
గొఱగాకుండియు మన్మథు। నొఱపులఁబడియెడు నితండుయువతిప్రీతిన్॥ ఛా॥

మూలము-

సీ॥ కఱకంఠుఁడక్కఱ కఱకఱికఱచుట కఱతలు కఱదులు కఱటికఱవు
కఱకఱనమరెమ్రోకఱలెనుక్కఱియయ్యెకిఱుమెట్లుకిఱుపుటకుఱుకుఱుకుఱు
కుఱకుఱుమాపుకక్కుఱితి కుఱంగట కుఱుచలు కుఱుపునింకెఱకెఱయుట
ఉక్కెఱకొఱలుటయును కొఱకొఱకొఱకొఱికె కొఱకొఱఁత కొఱడుకొఱవి
కొఱయుచాఁగఱగొనుటయుగఱికెగఱప। గఱగఱగొఱయునిఱిసెయుగఱిజిగిఱక
గిఱుబుగిఱికలుగిఱగొనెగుణదుపాత్రి। తాంతరధ్వాంతరవికాంతికాంతచరణ॥

ఈ పద్యమునందలి పదములకర్థోదాహరణములు వ్రాయఁబడును.

కఱకంఠుఁడు=శివుఁడు.

దీనికి "ఎఱుకు" అను శబ్దోదాహరణమునఁ జూడఁదగును.

అక్కఱ=పని; ప్రయోజనము.

చ॥ ఎఱిఁగితినన్ను నేను విబుధేంద్రుఁడవీవు జగత్త్రయంబుఁ గ్ర
చ్చఱభావదీయరక్షణమునంద వెలుంగుచునుండునట్టి ని
న్నఱుగనేను వేడుకొనయుక్తముగాక మొఱంగి నన్నన
క్కఱవడినీవు వేడుటదికర్జమె నిర్జితదైత్య చెప్పుమా॥ ఛా

కఱకఱి=బలాత్కారము.

చ॥ ఎఱుఁగరుగామొకద్భుతము నీచెలిదీక్షికిఁ దీర్థమాడ నా
యొఱుతగదల్చిపోవునాక హారముపోయిన నేనుపోవుదున్
మఱువక వెంటఁబోవ జలమగ్నతచేనదిసున్నమైనన్
గఱకఱిఁ జెట్టుసొమ్మడుగుఁ గాని నిజార్తియెఱుంగఁడేమియున్॥ ఆ-మా॥

ద్విపదము॥ కఱకటినినుఁ బట్టికదసినీమేనుఁ
దఱిగినీరక్తముల్ ద్రావెదనిపుడు॥ రంగనాథరామాయణము॥

కఱచుట=నేర్చుట, దంతపీడనము.

చ॥ తఱియగునంతకు న్నిపు మదగ్రతసైచుట నీతి నీవు నా
కఱపినయట్లు సేయుమత గంజని యాతనిఁ గాంచినన్ను నై
త్తెఱఁగున నైనఁ బొందఁగ మదింగలదేనియు నింతయేల గ్ర
చ్చఱ మునివర్గవాహనుఁడనై చను దెమ్మనుమంత దీరెదన్॥ భా॥

కఱచుటకు ణిజర్థమాగఁ బ్రయోగము.

గీ॥ తగినయెడఁ బాపాత్ములఁ దద్భటాలి। దహనకర్తనబంధనతాడనములఁ
బఱచువారలఁ గుక్కలుగఱచుఁ గ్రిములుఁ। దొలుచు గ్రద్దలునొప్పించుఁదుండనిహతి॥

కఱతలు=పోకిళ్ళు.

చ॥ కఱతలపూఁపవై మునులు గాననియట్టి కథల్వచింపఁగా
వెఱఁగిననీకు నాఁకలియు నేర్పులునాయనువారు మాయలం
బఱచిననేము వోమిఁక స్వభావపుదివ్యవిభూతితోడ నే
వఱలుచు మమ్ముఁ బ్రోవుమనువారును నైరపు డాసభాసదుల్॥ క-పూ॥

కఱదులు=వంచనలు; మోసములు.

క॥ కఱదులమాటలమమ్మం। గుఱుచవడుగ నేలయింతగా శంకింపన్
వెఱయఁగ నీ యిష్టముమా। కెఱిఁగింపుము వేడ్కనిత్తు నెయ్యది యైనన్॥ ఏ-హా॥

కఱటి=మూర్ఖుఁడు.

క॥ మఱచినఁ దలపింపఁగనగు। నెఱుఁగని నాఁడెల్లనాడు నెఱిఁగింపనగున్
మఱియెఱిఁగి యెఱుఁగనొల్లని। కఱటిం దెలుపంగఁగమలగర్భుని వశమే॥ భా॥

కఱవు=దుర్భిక్షము.

క॥ కఱవుపయిఁగఱవుపొరయుచు। వెఱవుపయిన్వెఱపుఁదోఁపవిడువనియిడుముల్
దొఱఁగమిపైఁబురుషుఁడిడుమఁ। దొఱఁగమిచేడ్పడుచునడచు దుష్కర్మములన్॥

కఱకఱ=అనుకరణవిశేషము.

చ॥ కఱకఱఁబండ్లుగీఁటుచును గాకదిగంతములుచ్చిపాఱఁగాఁ
జఱచుచు నిప్పుకల్చెదరఁ జూచుచుఁ గోఱలమంటలూరఁగాఁ

గొఱకొఱమానవుల్ మిగులఁ గ్రొవ్విసురారులనేఁప సాగరం
చఱిమఱిఁ జిట్టుముట్టుపడు నట్టులుమిట్టుగ నెత్తిపల్కెనన్॥ ఛా॥

మ్రోకఱిల్లుట — పతనభేదము.

గీ॥ అర్చియొడవంక సాత్యకియడ్డగింప। వాసుదేవుండువలవంకవచ్చియురము
వ్రేయనవ్వీరుఁడచ్చోటవ్రేసెఁదత్త, ఱించిపౌండ్రుఁడువిభుమ్రోకఱిల్లబడఁగ॥ సో-హా॥

ఉక్కిఱి — అనుచ్ఛ్వాసనము.

క॥ వెఱచఱిచినీటిలోను। క్కిఱిగా నాకమొసలిచూడ్కికి నగోచరమై
పఱతెంచికుంభసంభవు। చిఱుఁదొడవడిఁబట్టుకొనియె శిష్యులుజెదరన్॥ ఘా॥

కిఱుమెట్లు — ఉపానహములు.

మ॥ తఱినాక్రాంతసమస్తలోక బలిదైత్యధ్వంసి యో దేవ నీ
యఱకాలుద్ధతిరాపహుమండలము బ్రహ్మాండంబుతో నెత్తినం
గుఱుగుట్టించెదు సంధిబిట్టొఱలు నాఘోరాహి నీయంఘ్రికిం
గిఱుమెట్టైనవిధంబు నామనములోఁ గీలించినట్లయ్యెడిన్॥ వై॥

కిఱ్ఱుమెట్టుచు శబ్దము ద్విత్వలోపమై కిఱుమెట్టని పై పద్యమునఁ బ్రయోగింపఁబడినదని యెఱుంగునది.

కిఱుపుట — కదల్చుట.

చ॥ ఉఱకనరుండు ద్రోణసుతుయుగ్యముల న్వెసనొంచెనాతఁడుం
దెఱపియొకింత గాంచి ఘనతీవ్రశరంబులనారిఁ గ్రుంచి క
న్గిఱపిన మాత్రలోన యతనింబటుబాణచతుష్కయుగ్మమే
డ్తెఱఁదొడి మార్వ్రక్కమ్మఱ ఘటించునెడన్వడినేసి యార్చెనన్॥ ఘా॥

ఇది గకారాదిపదమని దీనిం గొందఱందందని యున్నారు.

క॥ గిఱుపునెడ వేయునెడ వడిఁ। బఱచునెడఁ బెనంగునెడన పారబలంబుల్
మెఱయునెడభీమునకునం। దొఱుఁగిడ్పడఁ ద్రోణఁగిరుద్ధతులు రాజసుతుల్॥ ఘా॥

కుఱుకులు — రాసులు.

మ॥ విఱిగెం బెక్కు రథంబులొక్కమొగి నుర్వింగూలె శుండాలముల్
దఱుచైరాలేఁదురంగ ❋ ❋ సంతానంబు లిఁతింతలై
కుఱుకల్గట్టె భటాంగకంబులు రణక్షోణిం బ్రవాహంబులై

పఱచె న్నెత్తురు భూతకోటి విహరింపం బ్రస్తుతింప న్సురల్॥ భా

కుఱుకాఱు = స్వల్పము.

క॥ తెలియఁగనీశుభలక్షణ। ములు కుఱుకాఱు కవుల కావ్యముల లేవు సుమీ
తొలుత మహాకవివర్యులు। పలికిన సత్కృతులఁ దక్కఁ బన్నగశాయనా॥ అప్పకవి.

కుఱుమాపు = కొంచెపుమాపు.

సీ॥ కఱకు లైవెలిసిన కుఱువెండ్రుకలతోడ బట్టయాదల గాలిపోగ యమర॥ వై॥

కుఱు అనఁగాఁ గొంచెము. కుఱువెండ్రుకలనఁగాఁ జిఱువెండ్రుకలు.

కక్కుఱితి = ప్రాల్మాలుట.

చ॥ గిఱికలఁ జెట్టిపేరినణఁగించి తొలంగితి మేని వట్టిక
క్కుఱితి నొకాని దైవమనుకూలము గాదు లవుండు మొక్కలీఁ
డుఱికినఁ బ్రాణహానియును నొవ్వమిఁ జేయునటంచు జీవముల్
దొఱఁగిన భావముల్లములఁ దూకొనఁ జేష్టలు దక్కియుండఁగన్॥ వై-భా॥

కుఱఁగటు = సమీపము.

కుఱుమాపు కుఱఁగటు కుఱుచ కుఱులు॥ అప్పకవి.

కుఱుచలు = నృత్యములు, హ్రస్వములు.

చ॥ తఱులఱనిక్కఁ బూఁత నెఱతావియ చిక్క నపాంగమాలికల్
మెఱుఁగులు గ్రక్క నూఱుపుల మేలిమి తేఁటులు చొక్క హారముల్
గుఱుచలు ద్రొక్క ... ... ... వసు॥

రెండవయుదాహరణమునకుఁ "గఱుదులు" అనుశబ్దమునకు వ్రాసిన యుదాహరణమును 74వ-పుటం జూడవలయును.

కుఱుపు = వ్రణము.

కుఱుపువ్రణము॥ అప్పకవి.

నింకెఱ = వేగము.

చ॥ వఱలఁగ రాముఁడంత నవవద్యుఁడు వచ్చి బహుప్రలాపరై
యఱచుచునున్న తల్లినిఁ గృతాంతవశస్థితుఁడైన తండ్రి, నిం
కెఱగని తీవ్రకోప పరిఖేదహృదుండయి తత్ప్రికారమం
దెఱిఁగి ముహూర్తమేనియు సహింపఁగ నోపక రోషదీప్తుఁడై॥ భా॥

సంకెఱయుటకు బదులు 'దిక్కఱగని' అని యొకపాఠాంతరము గలదుగాని దిక్కఱశబ్దమెచ్చటను గానరాదు. దిక్కఱయనఁగా నవస్థయని తోఁచుచున్నది. అన్వయరీతిని విచారించినను నస్మల్లిఖిత పాఠాంతరమే యుక్తముగనున్నదని సూక్ష్మదర్శులచే నవధరింపఁదగును. సంకెఱగనియను పాఠమునకు దుఃఖపడుతల్లినిఁ జచ్చినట్టి తండ్రిని శీఘ్రముగఁ జూచుమని యర్థము.

ఉక్కెఱ = వండినపిండి.

కెఱుప్రటకెఱయు టుక్కెఱయుఁ బక్కెఱయును॥ అప్పకవి॥

కెఱయుట కర్థము తెలియనందున నప్పకవియె ప్రమాణము.

కొఱటు = చిందుట, ప్రకాశించుట.

ఎఱుక యను శబ్దోదాహరణముం జూడవలయు.

కొఱకొఱలాడుట = కోపవికారము.

కఱకఱ అను శబ్దోదాహరణముం జూడవలయు.

కొఱుకుట = దంతపీడనము.

సీ॥ ఘనతటిల్లతల యట్లొసిమిడి దంష్ట్రలు మెఱయంగఁ బండ్లుగొఱికికొనుచు॥ భా॥

కొఱను = బీడు.

గీ॥ కొఱఁకసంగను బీడునాఁ గొఱనసంగఁ। గంచెయైన నప్రహతభూమి॥ ఆం.భా॥

క॥ కొఱఁకులు నెఱకులు ప్రూఁకులు। సిఱుకొలఁకులునయ్యెఁ బేనుబేను స్ఫీనులౌ
గొఱఁజేఁ బేలుమీలన। నుఱవగునిలవచ్చ తెలుఁగు లూహింపంగన్॥

(కొఱ అనను శబ్దమునకు 'స్వాంతాన్నామ్ని' ఇత్యాదిసూత్రముచే బహువచనమందు కుగాదేశమువచ్చి కొఱఁకులైనది. కావ్యాలంకారచూడామణి.)

కొఱఁత = తక్కువ, కొఱ్ఱు.

సీ॥ కొఱఁతనాఁ దక్కువ కొఱ్ఱువెలయు॥ ఆంధ్రభాషార్ణవము.

క॥ తఱచి పయిఁబడుటయు సెలు। వెఱుగంగా నేసె నతఁడు విక్రమలీలన్
గొఱఁతపడనీకకర్ణుఁడు। మెఱుఁగు లడరుశక్తి సురలు మెచ్చఁగ నేసెన్॥ భా॥

శూలార్థకమగునప్పుడు కొఱ్ఱుశబ్దమునకు వికారముగావున గురువు.

కొఱవి = అలాతము, కురుపక వృక్షము.

క॥ కొఱవియుఁ గొఱవియుఁ దాఁకెను। తెఱఁగున నర్జునుఁడు సురనదీసూనుఁడుఁ జూ
పఱువోఁగఁ దాఁకుట ని। ద్దఱిదిక్కులసైన్యములును దలఁపడియుండెన్॥ భార॥

ఈ శబ్దము రెండవయర్థముగునపుడు తద్భవము 'కొఱపులై యొఱుఁగంబడెఁ గొన్ని భూజముల్' అనియాముక్తమాల్యదలో శ్లేషరచనవలనను నిదిలఘువనుటకుఁ బ్రయోగముఁగానరాకుండుటవలనను గురురేఫయని నిశ్చయింపఁబడియెను. 'కొఱవినాఁ గ్రోవినాఁ గ్రొమ్మినాఁగఁ గురువకనామమూ' అని యర్ణవము. ఇది కురువక శబ్దమువలననె పుట్టినది.

కొఱ=మనోజ్ఞము, పని, తక్కువ, సస్యవిశేషము, మత్స్యవిశేషము.

క॥ కొఱమాలిన దుర్లక్షణ। కొఱఁగాదిది నీకు నారి గుప్తంబుగ ని
ర్జరభిని వధించి సీతో। నఱలేనిమనోజ్ఞకేళి నలరెద నెలమిన్॥ రామాయణము॥

(పనికిమాలిన దుర్లక్షణములు కలదిగావున మనోజ్ఞురాలు కాదనియర్థము.)

చ॥ తఱగొనియంతలోన మధుదైత్యహరుం డమరేంద్రు నిండెనిం
గొఱనెలపూవులందునిమి॥ ... ... పారిజాతాపహరణము॥

సస్యమత్స్యపక్షములయందు. కొఱ్ఱయను శబ్దము ద్విత్వలోపమైనదిగావున గురుత్వము నిర్వివాదము. "కొఱకొఱ్ఱయనఁగను బరఁగుసాళీవంబు" అని భాషార్ణవము- ఈనిఘంటువులో లఘువునకుఁ బ్రాసమున్నదని శంకింపవలదు- ఇందానియమము పొత్తుగా లేదు. విస్తరభీతిచే వివరింపము.

క॥ జుఱజుఱయని నెత్తురువెలి। కుఱుకుచుఁ రొద సేయ నఱుతి యొఱఁగినయూర్వుల్
పఱవమిడి గ్రుడ్లవడఁకుచుఁ। గొఱఁ బ్రాణముతోడఁ దన్నికొను నమ్మొదవున్॥

కొఱఁ బ్రాణమనఁగాఁ గొట్టుసురు.

చాఁగఱగొనుట=చంపుట, సులుముట-

చ॥ మఱువక త్రుంచి మదమానములం జెఱువుచ్చి మెచ్చుఁజాఁ
గఱగొని క్రోధకామముల గండడఁగించి పరోపకారమున్
జఱిపడఁ ద్రోఁచి వాచవుల చట్టలువాపి తొలంగి చిత్తముల్
జఱబడియున్న నీకు నొకచక్కటి నెక్కటి వేఁడఁ గల్గెడిన్॥ స్తో-హ

గఱిక=తృణము

గఱికనట్టులు గఱగఱికలు॥ అప్పకవి॥

గఱి=పక్షము.

చ॥ అఱమి విభావరీచరులు నమ్ముల మర్మము గాడనేటులం
గఱలుమునుంగ దూఱ నెలకట్టియపోట్లను గుంతలాదులం

వఱుచుగఁ దాఁకు పోట్లనుగదాపలిఘాదులనెల్ల మున్నొనల్
పఱిపఱిగా బలీముఖులు పాట్లసెలంగఁ బెనంగిరయ్యెడన్॥ రా-మా

గఱగొఱ=లోపము; న్యూనత.

ఈ శబ్దమును గొందఱు కాదివర్ణముగా 'కఱకొఱ' అనివ్రాసి కళ్ళలమని యర్థముంజెప్పిరి. మఱికొందఱు 'గఱ=కొఱ' రెండుపదములకు ద్వంద్వసమాసమనియుఁ గఱయనఁగా నపఖ్యాతియనియుఁ గొఱయనఁగా న్యూనత్వమనియుఁజెప్పిరి. అట్లులయినఁ గొందఱు నైఘంటికులు గకారాది శబ్దములలో వ్రాయుటవలననా చేతనట్లనే చెప్పఁబడియెను.

చ॥ తఱిమిసుశర్మతమ్ములును దానునుబోరికినన్నుఁ బిల్వ వే
నెఱుఁగని యట్లులుండుటిది యేపురుషార్థమువారినెల్లనే
తెఱసుఱుమాడఁ బంపుమకడిందిగఁజూడకు వారినేమియుం
గఱగొఱరాదు పో మిడుకఁ గష్టమునాకు నుదాత్తమానసా॥ భా॥

గఱిసె=కొల్తభేదము.

గఱిసె డగ్గఱియించ గఱెపగఱయు॥ అప్పకవి॥

గఱిలె=దర్వి-

అఱఁటియను శబ్దోదాహరణమునందుఁజూడఁదగును-

కొఱడు=తిన్ననియింద్రధనున్ను

కొఱడనరోహితమ్మదోఁచుఁబురారీ॥ ఆంధ్రభాషార్ణవము-

పండ్లుకొఱుకుట కోపంబుకొఱడువడుట॥ అప్పకవి-

గిఱులు=గుండ్రనిగీఁటులు-

గిఱులువ్రాయుట మోటగిఱుకయు॥ అప్పకవి-

గిఱికలు=చిక్కులు

కక్కుఱితియను శబ్దోదాహరణమునందుఁజూడఁదగు-

గిఱిగొనుట=వాటుకొనుట; కప్పుకొనుట

క॥ ఉఱకమదియాంగంబులు। గిఱిగొనన ట్లొయుటయును గినుకగదిరినన్
మెఱుఁగారు నారసంబులు। దఱుచుగనించితిఁగడంగి తద్గాత్రములన్॥ భా॥

తే.గీ॥ గుఱుకొనుట గుఱుకు గుఱ్ఱించె గుఱుతు గుఱిచి
గుఱుకు గుఱుకొండి గుఱుములు గుఱుకుఱు మిడిగాఁ
గుఱులు చిగిఱిచె గెఱ గొఱగొఱ గొఱుగుట
యద్వితీయాస్త్ర యాగపద్య హృత తాళ॥

ఈపద్యమందలి శబ్దోదాహరణములను వ్రాసెదను-

గుఱుకొనుట—ఉద్యోగించుట, యత్నము సేయుట-

క॥ మఱియును నాకనాఁడెవ్వరు। తెలుఁగక యుండంగఁ గౌరవేంద్రుఁడు ధర్మం
బెఱుఁగక విషమన్నముతో। గుఱుకొని పెట్టించె గాడ్పుకొడుకునకలుకన్॥ భా॥

గుఱుగుఱ్ఱించుట—గుఱుపెట్టుట-

"కిఱుమెట్టు" అను శబ్దోదాహరణంబునం జూడవలయును-

గుఱుతు—అభిజ్ఞానము, ఆనవాలు.

చ॥ ఒఱఁగినఁజూచి యానృపకులోత్తము చిత్తము కూర్మి కొత్తని
వ్వెఱపడి తాపవారకము విస్మయనీయము నింతి నెయ్యపుం
గుఱుతునునైన మత్కర వినూతనహారముఁ జేరఁబోయి యా
నెఱదొర కంఠపీఠమున నిల్పితి నిల్పఁ బ్రఫుల్లనేత్రుఁడై॥ వసు॥

గుఱిచి—ద్వితీయా విభక్తి ప్రత్యయము-

చ॥ ఆఱువదియేడుకోటు లరయన్ సురసంభవులైన యూథపుల్
నఱుమయి రన్యజాతులు రణంబునకుంగల వీరులెందఱం
బఱపడి రమ్మహాభుజుఁడు దత్తవరుండని బ్రహ్మవాక్యముం
గుఱిచి విసంజ్ఞనొందిరి రఘుక్షితినాథులు నేమిసెప్పుదున్॥ రామా॥

గుఱించి—గుఱిచి (పైయట్లనే)

గుఱుకు—ఈఁటె-

"ఇఱుకు" అను శబ్దోదాహరణమునం జూడవలయును-

గుఱుకొండి—మర్మము, రహస్యము.

గుఱుకొని గుఱిగుఱు గుఱుకొండి గుఱుతు॥ అప్పకవి॥

గుఱుములు—బీజములు.

గుఱుములు గింజలు గొఱుగుట వపనంబు॥ అప్పకవి॥

గుఱగుఱ=అనుకరణధ్వని-

గుఱుకవెట్టుట గుఱగుఱ గుఱువెట్టుట॥ అప్పకవి॥

మిణుఁగుఱులు=అగ్నికణములు-

చ॥ మెఱయుచునున్న వజ్రహతి మేరుతటంబునఁ జెల్లునన్మిణుం
గుఱులన విస్ఫులింగములు గుంభుని ముష్టి విఘట్టనంబునన్। వఱలఁగ॥ రామా॥

గెఱ=గుండ్రనిగీటు-

సీ॥ గెఱకట్టుకొనిపుట్టు నెఱపూఁప చనులతో॥

గోఱగోఱ=అనుకరణధ్వని విశేషము.

గీ॥ తెఱలిరయిుండొక్కటిని రూక్షదృష్టిఁజూచు। గోఱగోఱను మూల్గుగద్దించి తఱిమి
కలసి కలహించు ఘోంకృతి కలకలముగ। జాగిలంబులురోష భీషణములగుచు॥ క-మ॥

గోఱుగుట=క్షౌరముసేయుట.

గుఱుమ్రుఁకను శబ్దోదాహరణముం జూడవలయు.

మూలము-

క॥ చఱచుట వెఱచఱచుట వా। చఱచుట చిచ్చఱయు కొండచఱులు చిఱుత రొ
చ్చెఱుట చిఱికొంగ్రె ఁఱుచు। చ్చెఱుటయు చిఱుముట భుజంగశేఖరతల్పా॥

ఈపద్యమందలి శబ్దములకు నర్థోదాహరణములు వ్రాయఁబడు.

చఱచుట=కొట్టుట; సాఁగఁగొట్టుట

క॥ వెఱచఱువఁ బట్టుకొనిపడిఁ। జఱచి జరాసంధు సంధిసంధులయెమ్ముల్
విఱిచివధియించి యార్చెను। వఱలఁగభీముండు భూమివలయంబద్రువన్॥ భా॥

కొడవలి కాఁచి చఱచుట, కరమునఁజఱచుట-

వెఱచఱచుట=భయపడుట

క॥ ఎఱకలగాడ్పునవొగివెఱ। చఱవఁగ వడి వీఁచి యతని శాత నఖములన్
జాఱఁజాఱఁ జీరియు ముక్కునఁ। గఱచియునొప్పించెవాఁడు కరువలితనయున్॥

వాచఱచుట=పరిదేవనము

వాచఱచుట కొడవలికాఁచి చఱచుట॥ అప్పకవి॥

చిచ్చఱ = అగ్నిమయము

చ॥ చిఱునగవొప్ప గాండివముఁ జెచ్చెర సజ్యము చేసి సేనలు
క్కుఱ రభసంబు మైపడరఁగ న్వడిద్రోణియు నీడువోకయ
త్తఱిఁ దలుమంగ నస్త్రములు దండధిదార్కొని మండుచుండెఁ జి
చ్చఱపిడుగుల్వడిందొరఁగుచాడ్పున నంబరవీథినుగ్రమై॥ భా॥

చఱులు = సానువులు

క॥ మఱునాఁడయిగుటు లెస్సఁగ। నెఱిఁగెనినుండవుడు వేఁడిగొడలినదీప్తుల్
మెఱఁగలిగొనపశ్చిమగిరి। చఱికి ననతి దూరమునవిశేషుఁడైతోఁచెన్॥ భా॥

ద్వారకాపట్టణము మునిఁగిపోవుటకు శ్రీకృష్ణస్వామి యవధిచేసిన సప్తమ దినము మఱునాఁడేయగుట యర్జునుఁడు లెస్సగాఁ దెలిసికొన్నాఁడనుట. ఈ పద్యములో నప్పకవీయములోఁ బాఠభేదమున్నది. అదితప్పగానున్నది.

చిఱుత = బాలుఁడు, చిన్నదారుఖండము, మృగవిశేషము.

క॥ సోలవకతూరిఁగలకా। ల్బులఁ జెట్టితివీవు నీచిఱుతకాలము ద
త్ఫలమిప్పుడనుభవించితి। తొలఁగునె హింసాపరులకు దుఃఖంబనఘా॥ భా॥

ఈ శబ్దమునకు వ్రాసినయర్థము లన్నియును జిన్నయను శబ్దమునుపట్టివచ్చినవే కావున నన్నింటికిదియే యుదాహరణము.

ఎచ్చఱుట = ప్రబలుట.

చ॥ మఱుసటినాటి వేకువ నమాత్యుఁడు మేల్కని వంశమంతయున్
జెఱిచిరి కూఁతురుం గొడుకు చెల్లరెమీఁదటఁ జంద్రహాసుఁడె
చ్చఱినఁ బ్రమాదమౌననుచుఁ జిత్తమునందలపోసి వీనినే
తెఱఁగుననైనఁ బంపెద యతిప్రవరోక్తులు బొంకుసేసెదన్॥ జై-భా॥

చిఱుకొట్టుట: ముచ్చఱుట = వ్యసనపడుట.

చిఱికొట్టె చిఱిమి ముచ్చఱితనమున॥ అప్పకవీయము॥

ఉ॥ ముచ్చఱనేల నేఁగలుగ మద్దియనాకువృకోదరుండు వి
వ్వచ్చుఁడు దోడుగా * * * భా॥

చిఱు = చిన్న.

("చిచ్చఱ" అను శబ్దోదాహరణముం జూడవలయును. ఇట్లు చిఱునవ్వు, చిఱుఁదోడ, చిఱుకప్పు, మొదలైనవి గురురేఫములే)

చిఱుముట = చిమ్ముట, చిదుముట యనియుఁ గొందఱు.

చ॥ పెఱుకుదుమే ఫణీంద్ర విషభీకర దంష్ట్రిలు సేలఁ గ్రుంగఁ జేఁ
జఱతుమే నింగి మ్రింగుదుమే చండదిశా గజదంత కాండముల్
బఱతుమె వారిధుల్ పిడిసిలింతుమె మందర మంగుటంబునన్
జిఱుముదుమే జగంబు లఱచేతికిఁ దెత్తుమె రాక్షసేశ్వరా॥ రామా॥

మఱిజగన్మోహన మాయచాల్చినజాల
చిఱుముతఱి ద్రౌపదికిఁ జీరలిచ్చిన కాల॥ అప్పకవి॥

మూలము-

క॥ చుఱుకు చుఱువుచ్చె చుఱచుఱ। చెఱమలు చెఱిసగము చెఱుకు చెఱలాడుటయున్
చెఱువు చెఱముటయు చెఱచుట। చెఱచోఱ యోగీంద్ర హృదయసేవితచరణా॥

ఈ పద్యమునందలి శబ్దముల కర్థోదాహరణములు వ్రాయఁబడును.

చుఱుకు = వాఁడి, కాఁక

"గుఱుకు" అను శబ్దోదాహరణమునం జూడవలయును.

చుఱుపుచ్చుట = కాల్చుట.

క॥ ఎఱమంటలు మిగుల నాతని। నెఱిచూపటు నిలువనందు నీలు గఁదరువుం
జుఱుపుచ్చి పిడుగు క్రియఁ గను। గిఱపిన యంతట నెగడపెఁ గిల్బిషుఁ బగతుణ్॥

చుఱచుఱ = అనుకరణవిశేషము.

"పెఱచఱచుట" అను శబ్దోదాహరణముం జూడవలయును.

చెఱమలు = నాసాపార్శ్వములు.

"అఱిముఱి" అను శబ్దోదాహరణమునం జూడవలయును.

చెఱిసగము = సమభాగము.

చెఱసాల చెఱకులు చెఱిసగంబు॥ అప్పకవి॥

ద్విపద॥ తఱిమి యొక్కుమ్మడి దారుని గ్రఘునిఁ
చెఱిమూఁట సాయకాసీతి నంగదుని॥ రం-రామా॥

చెఱకు = ఇక్షువు.

క॥ విఱుతునా మ్రింగుదునో తలఁ। దఱుగుదునో యేను జ్వరుఁడఁ డాసుం జ్వరుఁడా
కఱకంఠు నేయవిల్లగుఁ। జెఱకుం జెఱకైన వంటచెఱకుం జెఱకే॥ సో-హ॥

చెఱలాడుట=భ్రమించుట.

సీ॥ చెఱలాట చెఱుచుట చెఱుముట రాచుట॥ అప్పకవి॥

చెఱువు=తటాకము, సత్రము.

క॥ చెఱువు నడుమఁ బసినను బెరు। చెఱ గృహగములు బెదరినను వివేకనిధీయు
కఱిబహుళసైన్యమతిమఱిఁ। బఱచిన నాఁగంగరాదు బలియురకైనన్॥ భా॥
చెఱువున భుజియించి చెఱకుఁ బట్టి॥ అప్పకవీయము॥

చెఱుముట=రాచుట.

"చెఱలాడు" అనుశబ్దోదాహరణమునం జూడఁదగు.

చెఱుచుట=పాడుసేయుట.

గీ॥ చేయుచున్న దితిజనాయకుఁడతిభీతి। నెఱిఁగి హానితపముఁ జెఱుపఁ బంపె
జలజనయనఁ దరుణిజలపదయని మొదు। దాని వదియు వచ్చె వానికడకు॥ భా॥

చెఱ=కారాగృహము, స్త్రీలబలాత్కారముగాఁ బట్టుట.

క॥ నఱుకుట యర్థముఁ గొనుటయుఁ। జెఱ నునుచుట కట్టియడచి చేట్పాటొందం
బఱచుట మొదలుగఁగల పలు। దెఱఁగులఁ దగవు మెయినడపు ధీరవిచారా॥ భా॥

చ॥ ఎఱిఁగి యెఱింగి మున్నతఁడె యెగ్గొనరించిన వానికైకదా
చెఱగొని వచ్చితిం బిదపసేఁత వృథాకథ లింక నేల శం
పఱ బ్రతుకింత తీయనె ఖరాదుల చావున కేమిచింత నీ
మఱఁదలి బన్నమేకరణి మానిని యీఁగుడు సంధిచేసినన్॥ రామా॥

చోఱ=మత్స్యవిశేషము.

చ॥ మఱియు విచిత్ర వల్గన సమక్రియ ఘోటకమబ్బిఁ జెం
జోఱవఱియంగఁ జొచ్చుగతిఁ జొప్పడ హానగసేనఁ జొచ్చె॥ రామా॥

(ఇది చోఱ్ఱియను పదమునకు స్వత్వలోపమై పుట్టినదిగావున గురుత్వము నిర్వివాదమే. అయినను స్పష్టార్థమునకుఁగాఁ బైయుదాహరణమును వ్రాసినారము)

మూలము.

సీ॥ తఱగరి తఱుగుట తఱిగొనె తఱియుట తఱియఁ జొచ్చుట తఱి తఱపి తఱిమె
తిఱితిప్పెఱెటు అగలి తుఱుసటితనమును తఱఁగలిచుటయును తుఱుముటయును,
తెఱకువ తెఱపియే తెఱ తెఱఁగు తెఱవ తెఱచుట తెఱగొల్పె తెఱలె తోఱఁగె
చిందఱ నందఱ యుద్దఱా నఱుకుట నఱుము సేయుటయును నఱుక్కుటయును

నఱుజూనిఱు పేదనుఱు పుటనుఱు ను నైఱులు। నెఱిక నెఱకులు నైఱసరి నైఱవ్రు నైఱయు
నైఱతనము జ్ఞానకీరమణీపదాబ్జ। నిత్యవిన్యాసధన్యాంక నిహతపంక॥

ఈ పద్యమునందలి శబ్దములకర్థోదాహరణములు వ్రాయఁబడు.

తఱగరి=జేహారి.

సీ॥ జట్టి కాఁడనఁగ నుజను క్రేతతఱగరియనఁగ నుదత్సహాయాఖ్య వెలయు॥ ఆం-భా॥
సీ॥ తఱగరిజేహారి తఱుగని సంపద॥ అప్పకవీయము॥

తఱుగుట=కోయుట: తక్కువయగుట.

క॥ వెఱఁగుపడి కుంభభవుఁడుం। బెఱరథికులు సూచుచుండ వీరములావున్
మెఱయఁ జలము నెఱయఁగఁదలఁ। దఱిగెద సైంధవుని వేలతలఁ కెదకృష్ణా॥ భా॥

క॥ మఱిరామేశక్షేత్రము। కఱకంఠుని కాటపట్టు కామితఫలముల్
తఱుగని ధాన్యము లెల్లను। నెఱయఁగ ఫలియించు నచట నిక్కముఁ గలుగన్॥ భీ-ఖం॥

తఱిగొనుట=ఉద్యోగించుట.

"కొఱ" అను శబ్దోదాహరణముఁ జూడఁదగును.

దీనివలనఁ దఱిగొల్పుటయును గ్రహింపఁబడును. అనఁగా నుద్యోగింపఁ జేయుట

తఱియుట=ప్రవేశించుట, చొచ్చుట.

గీ॥ అందుఁ బ్రథమముఖ్యులందఱుఁ గ్రందుగాఁ। దఱిసి తమయనుంగుఁ దెఱవ పిండుఁ
గూర్చికొని మనోజకోలాహలస్ఫూర్తి। యలరనందు నోలలాడుచుండ॥ ఎ-హ॥

తఱియఁజొచ్చుట=లోపలికి లెస్సఁ జొచ్చుట.

గీ॥ అరసికొని యెన్ని భంగులనైన నితని। తేరు మనబారికగపడు తెరువు గాంచి
యడరి బాసటమై యెవ్వరడ్డపడిన। మెఱుఁగు మెఱసినచాడ్పునఁ దఱియఁజొరుము॥

తఱి=సమయము.

"చిచ్చఱ" అను శబ్దోదాహరణమునం జూడవలయు.

తఱిపి=మదురు

సీ॥ నీటికై యేటిలోనికి డిగ్గఁగాఁ బెద్దతఱిపి పెయ్యలఁ బట్టనుఱికె నేఁడు॥ ఎ-హ॥

తఱుముట=పాఱఁగొట్టుట.

క॥ పెఱవారి నెల్లఁ దఱిమితి। నఱుకుదు పాండుక్షితీశనందనులను జూ
పఱనేయఁ జేతులాడవు। తఱుమరు నామీఁద నత్యుగ్రతవారున్॥ భా॥

తిఱిపెట్టుట = మరదగలుగుటచేఁ జెవిలోవత్తి పెట్టి త్రిప్పుట.

సీ॥ తిఱుగ రెండవసారి తిఱిఁ బెనచుట॥ అప్పకవి॥

తఱగలి = విఱుగుడుపాటు.

చ॥ వెఱువకుమీ కుమార పదివేలవిధంబులనైన నిన్ను నే
మఱువ మఱేడకుం జనుట మాని సుఖంబున దత్తవాటికిం
దఱగలిలేక సమ్మదముతో గమనించుము భీమనాయకుం
డఱగొఱలేని వేల్పు నిఖిలాభ్యుదయంబులు నీకునయ్యెడిన్॥ భీ-ఖం॥

తుఱుసంటితనము = ఔద్ధత్యము.

గీ॥ ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మంబు। తెల్ల నీకు నేల నెఱుఁగవలసెఁ
జిఱుతవానికింత తుఱుసంటితనములు। సన్నెవృద్ధజనములున్న చోట॥ భా॥

ఈ శబ్దము ధర్మియగునపుడు "తుఱసరి" అని రూపము. ఇది యాపవిభక్తిక
ములలోనిది కావున "ంటి" వచ్చినది.

తుఱఁగలించుట = భ్రమించుట, ప్రకాశించుట.

గీ॥ అవని గంపింప లలితపీతాంబరంబు। చెఱఁగు జూలఁ జక్రాంశులు దుఱఁగలింప
సింహనాదంబు క్రోధరంజితభయంక। రాననంబునఁ జెలఁగంగ నడరెఁ జెలుచ॥ భా॥

తుఱుముట = అలంకరించుట.

గీ॥ నెఱులుఁ దడియార్చి క్రొవ్విరుల్ దుఱిమి మేనఁ। గలపమునలంది తొడవులంగములఁబూని
కల్పవృక్షదుకూలాంశుకములు గట్టి। రంగవలు మూరునారతోఁ డియలుఁగులనఁగ॥

తెఱకువ = తెలివి.

సీ॥ తెఱవలు తెఱకువ తెఱఁగు విధము॥ అప్పకవి॥

తెఱపి = బయలు.

క॥ తెఱపిగొని నీవు చొచ్చినఁ। బిఱుదనఁ జొచ్చెదము రిపులు పెల్లగిలఁగ నం
దఱమును మాకిది యెంతయు। నుఱునట్టివరంబు దీని నానఁగుము పుత్రా॥ భా॥

ఏడ్తెఱ = వేగము, ఉత్సాహము.

క॥ పఱతెంచి మదంబున నే। డ్తెఱ వృత్తం జెత్తి క్రేయ దెప్పటికమున్
గొఱసంధివోయి వేలకు। నాఱగిన సింగంపుఁ గొదమ యొప్పమరంగన్॥ ఉ-రా

తెఱఁగు — విధము, సందర్భము, క్రమము.

“కొఱవి” అను శబ్దోదాహరణముం జూడవలయును.

ద్విపదము॥ మఱి రాముఁడున్నట్టి మార్గంబుఁ దెలిపి
తెఱఁగొప్పనమ్మ్ముని దీవింప వెడలి  రంగనాథరా॥

తెఱవ — స్త్రీ; బయలు-

సీ॥ తెఱవ నా బయలును స్త్రీ దనర్చు॥  ఆంధ్రభాషార్ణవము-

క॥ తెఱవ యొడఁబాటుమాటం। బఱివోయిన కొంకుతోటి బ్రాహ్మణి గొనిక
న్నెఱువగు పెడమునరిగిన। తఱి వచ్చె సుదర్శనుండు ధరణీనాథా॥  భా॥

చ॥ మఱియును బైపయిం బఱపు మార్గణవర్గము లంబరంబునన్
గిఱికొనుచుం బ్రచండగతిఁ గీలలు వాఱఁగ వచ్చి వృక్షముల్
దెఱవలు సేయుచున్ మిడలు ద్రెంచుచుఁ బొట్టుబుసించుచుం దొడల్
విఱుచుచు మస్తకంబులు దళించుచు నిట్లు వధింపఁ జొచ్చినన్॥  రామాయణము॥

తెఱమట — వివృతము గావించుట-

సీ॥ నీవు ముయ్యంగఁ దిమిరంబు నిఖిలలోక। చయము గప్పిన భూతముల్ భయమునొందె
నీకరంబులు ద్రోవకచీఁకటియును। జెఱుచుటకు ఫాలనేత్రంబు దెఱవవలసె॥  భా॥

తెఱకొల్పుట — బయలుపఱచుట-

తెఱలుట — బయలు దేఱుట-

సీ॥ తెఱలిన వాసన తెఱకొలుపుట॥  అప్పకవి-

తొఱఁగుట — విడుచుట-

“కఱవు” అను శబ్దోదాహరణమునందుఁ జూడవలయు- ఇది క్షరణార్థకమగు నపుడు ద్విరూపము.

గీ॥ వానిఁ దెగఁజూడవైతేని వాయుపుత్త్ర। నీవు కనుఁగొన నురినైన నీళ్ళనైన
నగ్నినైన విషంబుననైన నేను। మేనుఁ దొఱఁగుదు నెట్లు నీయాన సుమ్ము॥

చిందఱవందఱ — చెదఱిపోవుట-

క॥ వెఱవకుఁడు వెఱవకుఁడు సేం। దఱవందఱగాకుఁ డేల ధైర్యముఁ దూలన్
మఱచితిరె కులముఁ గీర్తియుఁ। బిఱుకులగతి నింత వలదు బీరము సెదరన్॥  సౌ-హా॥

ముందఱ = పురోభాగము, పూర్వము.

చ॥ చిఱుతదనంబునం దగవుఁజిత్తము నందలపోయ లేకముం
దఱనటు వోవనిచ్చితిఁబితామహుఁడుం జనకుండు నింకఁ గ్ర
చ్చఱనిలపంచి చక్కసగమక్కడ నెవ్వరికేనిమద్బలం
బెఱుఁగక యీఁ దలంచిననునేనది యేటికి సమ్మతించెదన్॥ భా॥

అద్దిఱ = ఆశ్చర్యవాచకము.

సీ॥ ముందఱ యద్దిఱ కట్టైదుఱను॥ అప్పకవి॥

నఱుకుట = ఖతము గావించుట, ఖండించుట.

"తఱుముట" అను శబ్దోదాహరణమునం జూడఁదగును.

నఱుము సేయుట = చూర్ణము సేయుట.

చ॥ అఱిముఱిఁద్రెళ్లెఁదేరులు గజావళి గూలెఁ దురంగమాంగముల్
గిఱికొనియెన్మహీస్భటులు లెక్కకుమిక్కిలి సేనపాడుగా
నఱుమయి రప్పుకృష్ణుఁడు నినాదము భూగగనాంతరంబునం
దఱచుగనొత్తె నిర్మథిత దానవసైన్యము పాంచజన్యమున్॥ భా॥

నఱుజు = సూక్ష్మము.

సీ॥ రఱుజుకొంచెము వ్రాను నఱుకుట. అప్పకవీయము.

నిఱుపేద = అతిదరిద్రుఁడు.

క॥ నిఱుపేదయింటికేటికిఁ। బఱతెంచు నిధానమట్లు బఱతెంచిన యీ॥ శృంగారనైష.

(ఇది యజాదిశబ్దమని (ఇఱుపేద) కొందఱనుచున్నారు. ఇఱు = అనఁగా నన్నవస్త్రములు రెంటికి దరిద్రుఁడని యర్థమఁట. అట్లైన నప్పుడీపదము లఘువగును గాని గురువు గాదు, విశేషించి యప్పకవి యీపదము హలాది పదములలో నిట్లు 'సీ॥' నఱుజుకొంచెము వ్రాను నఱుకుట నిఱుపేద నుఱుము గా నుఱుపుట నెఱవు బోడవు' అని వ్రాసియున్నాఁడు. కావున 'సీ॥ ఘనమైన రారాపు చనుదోయి రాయిడి నిఱుపేద నడిమికి వెఱపుఁ జూప' ననునిత్యాది స్థలములయం దయ్యర్థము సమన్వయము గాదు గదా. మొదటి వ్యుత్పత్తి విచార్యమై యున్నది.)

నుఱుపుట = మర్దించుట.

సీ॥ నుఱిపె నొత్తురు పేరులు వఱపి భీమ। సేన మాయన్న బళిని నే లేని చోట భా॥

నూఱుము — చూర్ణము.

క॥ మఱి దైత్యులుగ్రమ్మఱఁజన । మఱలిచనుచు దాశకంఠి మదమునఁగపులన్
నుఱుమాడఁజొచ్చెఁగూపుల । నెఱయ నదృశ్యత్వమొంది నిష్ఠురలీలన్ ॥ రా-మా॥

నెఱులు — కేశములు.

సీ॥ నెఱులనున్న నికప్పుతుఱఁగలిగొనగూడిపాదలు వెంద్రుకలు కొప్పునకునంద॥ ఎ-హ॥

నెఱిక — కచ్ఛభేదము.

సీ॥ అనమీఱుఁగచ్ఛభేదాభిధానమెసఁగుఁ గాసెఁగుచ్చెలకుచ్చెకచ్చెపింజ
చుంగు ఱింగు నెఱిక ఙింగు నెఱియనంగ॥ ఆంధ్రభాషార్ణవము॥

నెఱికయనఁగా "గాగరా" అని కొందఱందురు.

సీ॥ ✻ ✻ నెఱయుటనిండుట నెఱిక కాసె॥ అప్పకవీయము.

నెఱకులు — శల్యములు.

సీ॥ ✻ ✻ నెఱ కెమ్ముకయన నెగడు నస్థ్యభిధానము॥ ఆం-భాషా.

సీ॥ ✻ ✻ నెఱకు లాయంబులు॥ అప్పకవి.

క॥ ఆఱువది యఱువది యమ్ముల । నెఱకులు నోనాటనేసి నిలిపి తనరయుం
వెఱఁగించెము వ్వురకు న । త్తెఱఁగద్భుతరసము వెల్లిఁదేల్చెజనములన్ ॥ భా॥

నెఱసరి — సింహభేదము.

క॥ చఱి నుండి తొలఁగ నుఱికెను । నెఱసరి సింగంపుఁగొదమ నిబ్బరముగఁ గ్రే
ళ్లుఱి కెందొలఁగఁగఁబగతుని । యఱకటునుండి భువిమీఁదనబ్బలియుండున్ ॥ ఎ-హ॥

గీ॥ సింహపూర్ణోపమానముల్ చెలఁగును నెఱ । సరియటంచును బల్కె-ఢఁజంద్రచూడ॥

అని యాంధ్రభాషార్ణవములో 'నెఱసరి' శబ్దమునకు సింహసామాన్యమని చెప్పినాఁడుగాని పై యుదాహరణమువలనఁ దద్విశేషమని తోఁచుచున్నది.

నెఱవు — విశాలము, దీర్ఘము.

క॥ మఱిమఱి చీఁకటిలోనం । దఱు రాజులు సమరముడిగి తగనెల్లిటికిన్
గాఱకలకలనగునదువుడు । నెఱవగు గోవర్ధనాద్రి నేలకు ననుచున్ ॥ సో-హ॥

మ॥ నెఱవై యొప్పువినీలకేశములు నిర్నిద్రాననాబ్జంబు నే
త్రెఱ నూత్నాంబుదతుల్యకాంతియును నై దివ్యప్రభావంబునన్ ॥ ఎ-హ॥

నెఱి — నిగ్గు, కుటిలము-

చ॥ నెఱిఁగుఱులున్విలోలసిత నేత్రయుగంబును దేసెలొల్కు వా
తెఱయును దీనియాననము తెల్విగరంబు మనోహరంబు నే
నెఱిఁగినయంతనుండి సతినిట్టి లతా లలితాంగిఁజూచి యే
నెఱుఁగ సురేంద్రకన్యకలు నిట్టిరె రూపవిలాససంపదన్॥ భా॥

పై యుదాహరణములలో నీశబ్దము చ్చుటచ్చుట గలదుగావున నర్థభేదము విచారింపవలయును.

నెఱతనము — శ్రేష్ఠత్వము, పూర్ణత్వము, చతురత్వము-

సీ॥ నెఱచందురుని నిగ్గు నెఱపంగఁ జాలు నీనెమ్మోము తొలిమివద్మ్ము నేసె॥ భా॥

చ॥ మఱియు నతండు సంయమిసమాజ వినిర్మితజాతకర్ముఁడై
నెఱిఁబరివర్థితుండు నుపనీతుఁడునై వివిధాయుధంబులన్
గఱగరియై రణస్థితులగద్దఱియై నిగమాంతవేదియై
నెఱతనకాఁడునై మెఱసె నిర్మలకాంతివిలాసశేఖలన్॥ మను॥

ఇందుఁ గఱకరియనఁగాఁ గఱుఁగలవాఁడని యర్థము.

పఱాలము.

సీ॥ పఱియలుపఱువు చూపఱు పఱతెంచె తోప్పఱవెట్టెపఱివోయె పఱగొనుటయు
పఱపఱియలు పఱపఱియంపఱ పఱంటిపఱికెలు పఱిగలు పఱటిపఱచు
పిఱుఁదతెప్పిఱుటయు పిఱుఁదులుపిఱువోయె పెఱికలు పెఱికెదబ్బఱలఱుకుట
బఱబఱబిఱబిఱబిఱుసులు బుఱుజులు మఱగాలుమఱుకువమఱువు మఱఁది
మఱవక్రమ్మఱమఱఁదలేమఱుటమఱేఁగె। మఱుసటిదినంబుమఱుపడెమఱిపెడమఱ
మెఱుఁగుమఱునాఁడు పడమఱ మత్తదనుజ। మథితవిబుధకృపాదృతమనుజరూప॥

ఈ పద్యమందలి పదములకర్థోదాహరణంబులు దెలుపఁబడును.

పఱియలు — శకలములు.

గీ॥ పఱియవాపంగఁదునియగా విఱువవలయు। నెడలగాళ్ళను జేతులఁదొడలఁ బెట్టి
కడఁగియనువుగఁజేసి ప్రోవిడుదుగాని। కత్తిగొడ్డలియడుగ నేకట్టియలకు॥ భా॥
(ఇవి పట్టెయనుశబ్దమునకు ద్విత్వలోపమై యిట్టిరూపముంబొందినది.)

పఱపు = శయ్య.

క॥ వెఱువకుఁ గలవోఁ జేసిన। కొఱగామికి వగచుచోట గుణరత్నము చే
పటె నీకునలిగితన్నిన। పఱపుపయింబడినయట్లు పద్మదళాక్షా॥ సో.హ॥

చూపఱులు = చూచువారలు.

"కొఱవి" అనుశబ్దోదాహరణముం జూడవలయును. పుట-౭౭)

పఱతెంచుట = మీఁదికివచ్చుట.

"ఉక్కఱి" శబ్దముం జూడవలయును. (పుట-౬౫)

తొప్పఱవెట్టుట = తట్టువిఱుగఁ జేయుట.

సీ॥ తొప్పఱిలఁబండెనాఁగనుదోఁచుతట్టు। విఱుగఁబండెననుటకు ఆం-భా-స్క॥

మ॥ వెఱ నిట్లంబుధినాథనందనులు దోర్వీర్యంబుసాలించి యుం
దఱువాఱంగ నిశాచరేంద్రుఁడు జయోత్సాహంబునన్వెన్నడిం
దఱుమంగాఁ బ్రజసేయువీఁచుచు సముద్యద్భంగిమైఁబోలి తొ
ప్పఱవెట్టెన్ శరజాలముల్వఱపి కుప్పంగూఱ నాటించుచున్॥ తి.ఉ.రా॥

పఱినోవుట = చెడిపోవుట.

"తెఱవ" అనుశబ్దోదాహరణముం జూడవలయును. (పుట-౮౭)

పఱిగొనుట = ఆక్రమించుట, చెడఁజేయుట

క॥ వెఱిమీఱఁబండెపట్టిన। నఱిమఱిఁజంపినను గజమునశ్వము మచ్చెం
పఱిగొనినయట్టివారల। గొఱులంగీకరించుటొప్పఁగువలయపతికిన్॥ స్మృతి॥

పఱపఱియలు }
పఱపఱి } చిందఱవందఱ.

క॥ పఱపిరథికులను గూలుచున్। నఱికిన మోదుపడియుండె నానారథముల్
వెఱచఱచిరి కురుపీఠులు। పఱపఱియైనబలంబుభయముం బొందెన్॥ భా॥

లయ॥ తఱిమికొనిరక్కసుల వెఱచఱువఁ బట్టుకొని పఱపఱియలుగఁ దలలు నఱిపి
యవలలీలన్॥ రా-మా॥

క॥ పెఱిఁగిపిఱుసనినదెసఁ జై। కుఱుకుదు సాళువము గాకినాడిసినభంగిన్
వెఱచఱవఁ బోడవ్రుదుంబఱ। పఱిసేయుదు నీదుకోర్కె సారంబొందన్॥ భా॥

అంపఱ — బాణసమూహము.

క॥ * * అం। పఱతఱచుకోపకెంతయు। వెఱబొందివిపక్షులై రివిషయాధీశుల్

పఱుఁగు — శీఘ్రగమనము.

గీ॥ కంపతోఁడుగిడ్చినట్లొంటి గానిజన్న। తెఱవుగనివెంటనొకడేగ పఱుఁగుతోన॥ మను

పఱకెలు — పక్షివిశేషములు.

సీ॥ పఱకెలు పఱియలు పఱివోవు టంపఱ॥ అప్పకవి॥

పఱిగలు — ధాన్యాదుల నూర్చుతావు.

చ॥ ఎఱుఁగరుగాక లోకమున నెవ్వరికైనను మేలుసేయఁగా
నొఱపగు నాశ్రమంబున సమున్నతమైన గృహస్థధర్మముం
బఱకటువైచి గోఁచిఁగొని పాఱినపొల్లకముత్తిగల్గునే
పఱిగలనేఱినం గొలుచు పాఁతటికింగలదే తలంపఁగన్॥ సో-హ॥

పఱటి — కుంభము.

ఏఱగడుమత్తిల్లి పఱటిపుట్టువుగ్రుక్కఁగొనినయప్పుడుగలకుతిలపాటు॥ య-చ॥

పఱచుట — చేయుట, ధావనముసేయుట.

భంగపఱచె; ఏడ్పుఱచె, వీల్పఱచె, కీడ్పఱచె, ఇత్యాదులు.

గీ॥ అనదనైతినకట యాలికయ్యాలింపు। దకటమీరుగలుగనాక్రమించి
నన్నుఁబట్టిసూతనందనులిమ్మెయి। వెఱపులేక భంగపఱచువారె॥ భా॥

ఇదియొకానొకచోటఁ బొందించుటయనిగూడ నర్థమగుచున్నది.

మ॥ పఱచుందవ్వుగఁజేయలంతినిలుచుంబట్టికయాసాసగాఁ
బఱువోవుంబాదలందు ... ... ... ... భా॥

ఇచ్చటఁబఱచుననఁగా దూరముగా ధావనముసేయుననుట. ధావనార్థకమగు పఱచుటకు సకర్మకరూపము పఱపుట.

చ॥ మఱియొకఁడేను జెప్పెద నమానుషవిక్రమలీలనల్లడం
బఱపియుఁ జాపియుగ్రరిపున్నపాలకసైన్యమురూపడంచి మేన్
దాఁఱఁగుటయొప్పదే తనువుతూఁటులుగా నెఱవాదిగెల్పుకో
లుఱువాణనాదుకెంపుడుప నోవుచుశే మిముబోటులెమ్మెయిన్॥ భా॥

ఇంక నల్లడఁబఱపి యనఁగా నాల్గుదిక్కులకుఁ బాఱునట్లుచేసియనుట.

చ॥ ❋ ❋ విష్ణుం। బఱపెద విష్ణులోకములు భస్మము సేసెద

ఈ శబ్దము ప్రవహనార్థకమగునపుడు ద్విరూపమని యెఱుఁగవలయును-

చ॥ పఱచిన దేవకీసుతుఁడు పక్కన నవ్వెనఁ గ్రమ్మఱెల్లి పైఁ
దఱుచుగ రోమహర్షణ మొదంచిత భక్తిభరాకులత్వ మే
ర్పఱచుచుఁ గేల్మొగిడ్చి బుజ్జిపల్కుల తళ్కుల సన్న వెన్నెలం
బఱపుచుఁ బ్రస్తుతించె మునిబంధ విభుంబును భక్తరంజను౯॥ పాండు॥

పిఱుఁద = వెనుకను-

తెఱపి యను శబ్దోదాహరణమునంగనందగును- (పుట.౨౬.)

తెప్పిఱుట = తేఱుట-

క॥ పెఱికితినలుగులు మునులు। నెఱిఁబడ నెల్లెడలఁ గలయ నిమిరితి హరులి
త్తఱిసీళులు ద్రావక తె। ప్పిఱ వెల్లిక శత్రుసైన్యభీషణమూర్తీ। భా॥

పిఱుఁదు = నితంబము-

సీ॥ కనక మేఖలఁ గ్రుచ్చి కట్టె నెవ్వఁడు లీలఁ బిఱుఁదు పైఁ బూసార్కు మెఱుఁగుఁ బండ్లు॥

ఈ పద్యము కాశీఖండములోనిది- దీనిని తిమ్మకవి 'చెఱఁగునఁ బూసార్కు మెఱుఁగుఁ బండ్లు' అని వ్రాసినపాఠము వివేకులకు నంగీకారము కాదు-

పిఱువోవుట = వెనుకకుఁ బోవుట-

మ॥ పఱచుం దవ్వఁగఁ జేయలంతి నిలుచుం బట్టీక నాసాసగాఁ
బిఱువోవుం బోదలంచు డిందుఁ బోడముం బిట్టుల్కి వేదాఁటుఁ గ్ర
మ్మఱెచూచుం జెలి దార్చి నిల్చు మలయున్మట్టాడుఁ గోరాడు నే
మఱినన్నుండుఁ దృణంబులూను నెలయున్నా యా మృగంబిమ్మల౯॥ భా॥

పెఱికలు = గోనెలు-

చ॥ మఱియును సన్నిధిం గల సమంచిత కాంచన రాశిబండ్లనుం
బెఱికల మోపులుం గొలఁది వెట్టఁగఁ జెక్కగు బారువుల్ జనుల్
వెఱఁగు పడంగ ఖేచరులు వెక్కసమందఁగ శత్రుకోటికి౯
వెఱపొనరించు వార్త పృథివింబరఁగన్నడపించె భూవరా॥ భా॥

పెఱుకుట = పెల్లగించుట-

"తెప్పిఱుట" అను శబ్దోదాహరణమునం జూడవలయును-

దబ్బఱ — అనృతము.

క॥ నెఱయంగా నీఛందము। తెఱఁగెఱుఁగక కవితఁజెప్పెఁడిపురుషుఁడు ద
బ్బఱఁజేఁతఁజేఁకుగుఱ్ఱముఁ। బఱపినగతి నిఖిలహాస్యపదనిరతుఁడగుఁజా॥ భీ-ఛం॥

బఱుకుట — నెత్తురువచ్చినట్లుగోఁకుట.

సీ॥ ఊఱకడశక్తుఁడు తలలపైనటెకియాడు। బెఱుకుమీసలుకఱకుఁగాబఱకుగోళ్లు॥ రా॥

బఱబఱ — అనుకరణధ్వని.

సీ॥ బఱబఱనీడ్చె దబ్బఱఁబలుకుట॥ అప్పకవి॥

బిఱబిఱ — శీఘ్రము, బిఱుసులు — బాణసంచు.

బిఱబిఱఁ ద్రిప్పుట బిఱుసులు గాల్చుట॥ అప్పకవి॥

(బిఱుసులనఁగా నగ్నిబాణములు. ఇందులకుఁ బ్రయోగము.)

సీ॥ తగిలింపఁజెల్లున నెగయు నాకాశబాణంబులంబరవిమానములు దాఁట
దుఱుసుగా వెడలెడి బిఱుసులపువ్వులుఘనభోంతరములఁబొదివికొనఁగ॥ దశా॥

బుఱుజులు — కోటగోడమీఁద నాల్గువైపులను గట్టునిండ్లు.

బిఱబిఱఁ ద్రిప్పుట బిఱుసులు. అప్పకవి॥

సీ॥ బుఱుజులు మఱవమృద్భాండంబు మఱుఁగుచాటు॥ అప్పకవి॥

మఱగాలు — పొడుగుగాఁగనఁబడుటకుఁగాలికిఁగట్టుకొను కొయ్యకాలు.

సీ॥ * * పడమఱమఱగాలు పెడమఱలుట॥ అప్పకవి॥

దీనివలన 'మఱకాఁడు' అనుపదము గ్రహింపఁబడును.

మఱకువ, మఱపు — విస్మృతి.

'ఎఱుక' అను పద్యోదాహరణముఁ జూడవలయును.

క॥ మఱచితిఁగాకలతాంగీ। కఱకంఠుని తోడనాఁడు కాత్యాయని ని
న్నెఱిఁగెఱిఁగినాఁడుసెప్పిన। తెఱఁగిది సమకూడె నింకదిగులేమిటికే॥ సో-హ॥

మఱఁది — పెనిమిటితమ్ముఁడు, అప్పపెనిమిటి.

చ॥ మఱఁదులలోన నెన్నఁగలమాన్యుఁడపావనదండకోర్విబ
ద్దెఱఁగులఁబర్ణశాలలను దివ్యనిబంధులు గూర్చిపెట్టుటల్

